# అక్క మహాదేవి
# పలుకు



అక్క మహాదేవి ప్రసిద్ధిచెందిన శివ భక్తురాలు.
వీరశైవ భక్తి ఉద్యమకారిణి.
కాలం: 12వ శతాబ్దం.
శివుడే తన భర్తగా భావించేది. చిన్నతనం నుండి తనని తాను పూర్తిగా శివునికి అంకితమిచ్చింది.
నల్లమల్ల కొండ శ్రేణుల్లోని శ్రీశైలం కు 18 కిలోమీటర్ల దూరంలో కృష్ణా నదికి సమీపంలో అక్కమహాదేవి సహజ సిద్ధ గుహలు ఉన్నాయి.

డా. వేంపల్లి గంగాధర్

15 అక్టోబర్ 2024

అంబరాన్ని తాకే శంబర
శైల దేవ ఖాతా శిలా గహ్వార గవి లోంచి
వినిపిస్తున్న శివోహ కంఠం నీదేనా మహా దేవమ్మా ...

నల్లమల నిర్ఝరి నేల తాలుపుల్లో
కలిమి కొండ సిగలో పూసిన నందివర్ధనం నీవేనా
మహా దేవమ్మా...

Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar

మల్లెల తీర్థం బండపై భ్రమరపాదమై
గన్నేరు పూల గానమై
మల్లన్న చెంత మలయవాసినివై ఉన్నది
నీవే కదా మహా దేవమ్మా...



ఎక్కడమ్మా మహాదేవమ్మా...
అడవి అడివిలో వెతకమంటావా;
ఆకు ఆకులో చూడమంటావా;
పువ్వు పువ్వు ను అడగమంటావా;
గుట్టగుట్టలో తిరగమంటావా;
యేటి మడుగుల నీడల్లో జూడమంటావా...
కదళీవనం జాడల్లో తిరగమంటావా ..

మాట్లాడు తల్లి ...కొండచూలి... కాలాంజరి...



*Akka Mahadevi*
*Paluku*
*By*
*Dr Vempalli Gangadhar*

Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



నీ పాదం తాకిన నేల కింద
హిరణ్య వర్ణ ధారా స్రవంతి ప్రవాహ శబ్ద హోరు....

నువ్వు తాకిన సిరుగుబ్బ శ్వేత నీలాలకు
మబ్బు పువ్వుల గుత్తులు...





అడవి వెదురు పొదల
వేణువుల్లో
వినిపిస్తున్న వేదనా
స్వరం నీదే...

వన కాన కాంతారా
సానువుల
అరణ్య రహస్యం నువ్వే...

వింటున్నావా
తల్లి ...గుహజనని...
మహా దేవమ్మా ...

*Akka Mahadevi*
*Paluku*
*By*
*Dr Vempalli Gangadhar*

వియద్భూతి
తామిస్ర నిశీథమైన
కలిమి కొండ నెత్తిన
ఆకాశంలో వెలుగుతున్న
నక్షత్రం నువ్వే....తల్లి

Akka Mahadevi
Paluku
By
Dr vempalli gangadhar



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar





పాతాళగంగ సిరిగట్టు నుంచి
మల్లన్నకు మంగళ హారతి ఇస్తున్న చేతులు నీవే...



రాత్రంతా ....

అటు నుంచి ఇటు ఇటు నుంచి అటు

ఎంత వాన కురిసినా అదిగో ఆ చివర

నువ్వు కూర్చునే  రాతి బండ

తడవలేదు చూడు.......

వింటున్నావా తల్లి ..

యోగమయి...మహా దేవమ్మా....

Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar





Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar

మూల శిలకు మూడో కన్ను
మేఘ పుష్పాల అభిషేకం
అఖండలంలో అగ్గి నిప్పు
శ్రీ పర్వతం పైన సిరిగిరి మల్లన్న...



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



కొండ బిలం రాతి బండ పై తపస్సు చేస్తూ
నిరాకార గగన నభస్సు చూస్తూ
పంచభూతాలతో మాట్లాడుతున్నది
నువ్వే కదమ్మా....మహా దేవమ్మా ...

నింగి తో నేలతో నిప్పుతో నీరుతో గాలితోనే ఆత్మయానం
నాలుగు దిక్కుల లోక సంచారి జీవనయానం

తొలి దిక్కు వేళలో అరుణోదయ జనిధర్మం
పడమటి వేళలో అస్తమయ కాలధర్మం

నువ్వున్నట్లుగానే తల్లి.... మహా దేవమ్మా ...

Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar





Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar

చీకటి నిర్వాతి నిర్వాణం
దేహానికి చివరి విడిది రుద్ర భూమి
భర్గుడే భస్మాంగుడు

అక్కడ కాలే కట్టే ఏం చెప్తోంది ...?
కుళ్ళిన కళేబరం ఏం కోరుకుంటుంది...?



ఏమి ధరిస్తావు ఈ మట్టి శరీరానికి
ఏ సుగంధ లేపనాలు అద్దుకుంటావు ఈ మేనుకి
ఏమి కావాలి ఈ ఆయువు లేని దేహానికి

దిక్కులే అంబర మైన దిగంబర
శరణాగతి వైరాగ్య ముక్తి విశ్వంభర

క్షేత్రంలో నువ్వు... చరణం లో నువ్వు.... మరణంలో నువ్వు...

Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



కస్తూరి తుమ్మ మృగం
మృగనాభి గంధ ధూళి పరిమళం
ఆగని అన్వేషణ
జీవాత్మ వెతికే పరమాత్మ ఎక్కడ ?



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar

అరణ్యాలలో నువ్వు నడిచిన
కాలిబాటల వెంబడి నీ అడుగు జాడలు
పుట్టుకొచ్చిన జ్ఞాన ఖడ్గ లతలు...



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



గూడు మరిచిన గువ్వ
నీడ కోసం వాలని చెట్టు లేదు
వెతికి వెతికి చివరికి
దేవాలయం చెట్టు కొమ్మ పైకే చేరింది.



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



యేటి ఒడ్డున
గుట్టలుగా పడివున్న గులకరాళ్లు
అందులోని ఒక వజ్ర రత్నం
చేరాల్సిన చోటికి చేరి ప్రాప్తం పొందింది.

Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar





పంకిలం లో పరిమళించిన పద్మం
అరుణోదయ ఆలయ వేళ
చేరాల్సిన సన్నిధికి చేరి సిద్ధి పొందింది.

చేరాల్సిన చోటు ఏది?





*Akka Mahadevi*
*Paluku*
*By*
*Dr Vempalli Gangadhar*

నీ పలుకులే శరణం తల్లి మహా దేవమ్మా ...
వింటున్నావా తల్లి ... యోగమయి...మహా దేవమ్మా .....



శిరస్సు చేసే తపస్సు నీవే
ధనస్సు వీడిన జిరాస్సు నీవే

మండే కొండ పక్కన
పారుతున్న మంచు నదిలా..



వెండి శిఖరం అంచున
వెల్లువెత్తుతున్న స్వర్ణముఖి లా....

పరమశివుడి పాదాల చెంత
పరవళ్ళు తొక్కే పాతాళ గంగలా
ఉరకలెత్తుతున్న సింధు వాహిని ...

Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar









Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar

ఆరు కొమ్మల విపిన మద్ది భూరుహం కింద
నల్ల రాతి బండ పైన కొలువై
శరీర పంజరంలోని ఆత్మ చిలుకకు
ఏ దిక్కుకు ఎగరాలో దారి చూపే శిఖర వాసిని ....



దేహసౌందర్యం పిడికెడు భస్మం
కాయం కోమల జిలుగు బూడిద
మేని సొంపు సొగసు సొబగు బుగ్గి

*Akka Mahadevi*
*Paluku*
*By*
*Dr Vempalli Gangadhar*



ఉషస్సు నిండిన జ్ఞాన శిరస్సు నీదే
యాగస్సు పంచిన జ్ఞాన తేజస్సు నీదే

వింటున్నావా తల్లి ...
యోగమయి...మహా దేవమ్మా....



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar





దోసిళ్ళతో నిప్పు పూలు తీసుకొని
కొప్పున ముడి వేసుకున్న అగ్నిశిఖ...



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



ఉరుములు ఉరుముతూ
మెరుపులు మెరుస్తూ
పిడుగులు కురిసే కాలం
జడి వాన ధారా సంపాత ఉపదేశ వాగ్ఝరి....



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar

శ్రీశైలమే శ్రీ పర్వతం
కైలాసమే కదళీవనం

కారడవులలో కైవల్యం
ముక్తి భూమిలో మోక్ష సాధన



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar





కన్నీటి కొలను నిండా
వికసించిన భక్తి పుష్పాలు
శోకం రాసిన శ్లోకం నువ్వు



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar

# పాప పుణ్యముల గరళ కంఠం
# జీవ దేహముల కాల కంఠం



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



నల్లమల కాననం నీకై నీడను
మోసుకొొచ్చింది చూడు తల్లి...
యోగమయి...మహా దేవమ్మా ...



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar



యాతనో కోతనో శంకరార్పితం
స్వర్గమో నరకమో పరమేశ్వరాత్మకం



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar





వేదనో రోదనో ఈశ్వరార్పితం
మరణమో శరణమో ముక్తిదాయకం



Akka Mahadevi
Paluku
By
Dr Vempalli Gangadhar

**Akka Mahadevi - ಅಕ್ಕ ಮಹಾದೇವಿ, c. 1130–1160) was an early poet of Kannada literature and a prominent member of the Lingayat Shaiva sect in the 12th century. Her 430 vachanas (a form of spontaneous mystical poems), and the two short writings called Mantrogopya and the Yogangatrividh are considered her known contributions to Kannada literature.**



*Akka Mahadevi*
*Paluku*
*By*
*Dr Vempalli Gangadhar*



# అక్క మహాదేవి

# పలుకు





AKKA MAHADEVI

PALUKU

BY

DR VEMPALLI GANGADHAR

FIRST WRITER IN RESIDENCE AT RASHTRAPATI BHAVAN
SAHITYA AKADEMI FIRST YUVA PURASKAR WINNER IN TELUGU